శ్రీ రామాయనమః.

# పుత్ర శతకము

(కంద పద్యములు.)

కం॥ శ్రీగణనాథుని, వాణిని
బాగుగ భజియించి నేను - బడిబాలురకున్
వేగముగ విద్యలబ్బగ
నేగతియును దలంచువాఁడ - నిలలో పుత్రా 1.

కం॥ చెప్పెడి విషయము తెలిసికొని
తప్పక చరియించు చున్న - ధరలో, నీ కె
ల్లప్పుడు శుభమ్ము గల్గును
మెప్పును బడయంగఁ గలవు - మిన్నగ పుత్రా. 2.

కం॥ విడువక నైదవ యేఁటను
బడిలోఁ జదివింతు రోయి - పలకయు బలపం
బిడి, నీ తలి దండ్రులు, నిను
విడిపోతురు గురుని చెంతఁ - బ్రియముగ పుత్రా 3.

కం॥ బడియందుఁ జేరి క్రమముగ
క్రమముదమున గురుఁడు నేర్పఁ - గల వర్ణములన్
క్రమ పదములు, గుణితంబుల
విమలక నేర్వంగవలయు - వినుశా పుత్రా 4.
కం॥ క్రమ మెఱిఁగియు పాఠంబులు
గమనముతో గురుఁడుఁ జెప్పఁ - గడు శ్రద్ధగ, నా
సమయంబున నెఱిఁగిన, నీ
కమరును శీఘ్రంబులోన - నరయఁగ పుత్రా 5.
కం॥ పాఠము, పద్యముఁ జదివెడి
పాటంబు నెఱింగి నీవు - భయమును లేకన్
ధాటిగఁ జదివినయెడ, నీ
సాటి యెవరు లేరు చూడ - జగతిని పుత్రా 6.
కం॥ ఒరవడిఁ జూచియు క్రిందన్
వరుసగ గమనించి నీవు - బఁతులయందున్
పరిపూర్ణంబుగ వ్రాసిన
గురుతుగ వర్ణములు వ్రాయఁ-గుదురును పుత్రా 7.
కం॥ 'లోకజ్ఞానము' బడిలో
ప్రాకటముగ గురుఁడుఁ జెప్ప - వ్రాసియు దానిన్

జేకొని శ్రద్ధగఁ జదివిన
చేకూరును శుభములెప్పుడు - క్షితిలో పుత్రా 8.

క॥ వ్రాయను, జదువను, లెక్కలు
వేయను, వచ్చువఱకైన - వెడలియు బడిఁగోఁ
బాయక శ్రద్ధగ నేర్చిన
శ్రేయంబులుఁ గలుగు నీకు - స్థిరముగ పుత్రా 9.

క॥ శతకము లమర నిఘంటువు
లితిహాస పురాణ కావ్య - మెట్టిదినైనన్
సతతము శ్రద్ధగఁ జదివిన
మతిమంతుఁడ వౌదు వీవు - మహిలో పుత్రా 10.

క॥ తెల తెలవారఁగ లేచియు
పలుఁదోమియు బొట్టుఁబెట్టి - బాగుగ నపుడే
చలిదన్నముఁ దిని చనవలె
పలకయు దస్త్రంబుఁ బట్టి - బడికిని పుత్రా 11.

క॥ పలకయు, బలపము, పుస్తక
ములు, మశిబుడ్డియు, నొరవడి - పొత్తము, పెన్సిల్
కలములు మొదలగునవి, కా
వలయుఁ జదువునపుడు నీకు-వసుధను పుత్రా 12.

కం॥ కలకయు, బలపము, పొత్తం
బులు, వేల్పు పఠములు, పాద-ములకుఁ దగులఁ జే
తుల నంటియు కన్నులకుఁ
మెలకువతో నద్దుకొనిన - మేలగు పుత్రా 13.

కం॥ చెప్పినపాఠము నొజ్జకుఁ
దప్పేమియు లేక నీవు - తడబడక, వడిఁ
జెప్పఁగవలె. లేకుండినఁ
దప్పక శిక్షించఁగలఁడు - ధరలో పుత్రా 14.

కం॥ మాపటి పూటను శ్రద్ధగ
దీపంబున చెంతఁజేరి - దిన దిన పాఠాల్
రూపికతోఁ జదువుమురా
నీ పాఠములెల్ల వచ్చు - నిజముగ పుత్రా 15.

కం॥ తినుబండములఁ జేకొని
తినుచుఁ బడి కేగఁబోకు - తెలిసిన, పిల్లల్
కని యడుగఁ జూతు రాపై
కనుఁగొని శిక్షించుగురుఁడు - కట్టిగ పుత్రా 16.

కం॥ తుడువకు, దిద్దకు, ముద్దలు
పడునట్లుగ వ్రాయఁబోకు - పంతులు వాటిఁ

విడువక పరికించియు నిను
తడయక శిక్షించగలఁడు - ధరలో పుత్రా 17.

కం॥ ప్రక్కన నుండిన వారిని
నొక్కిన, నీచపు పలుకులు - నుడివిన, నటుపై
నిక్కినను, వెక్కిరించిన
చక్కగ శిక్షించు గురుఁడు - జగతిని పుత్రా 18.

కం॥ చక్కగ పంతులుఁ జెప్పెడి
లెక్కలు, మొక్కములు, యుక్త లేఖనము, కథల్
ప్రక్క పలకైనఁ జూచిన
గ్రక్కునఁ గని శిక్షఁజేయఁ - గాంచును పుత్రా 19.

కం॥ పని లేక నీవు బడికిని
జనకుండిన పంతులయ్య - చయ్యనకొట్టున్
పనియున్న సెలవుఁ గైకొని
చను చుండిన శుభముఁ గల్గు - జగతిని పుత్రా 20.

కం॥ బడిలో పంతులు లేఁడని
బడిపాఠము మాని తోడి - బాలురతోడన్
గడబిడలుఁ జేయుచుండిన
విడువక నిను శిక్షఁజేయు - పెంపుగ పుత్రా 21.

కం॥ లెక్కలు నెఱుఁగుట కొఱకై
ముక్కెముగా నెక్కములను - ముప్పాతికలన్
యెక్కువ మానములన్, నీ
వక్కరతో తెలిసికొనుము - యువనిని పుత్రా 22.

కం॥ బడికేగక యుండిన, నిన్
బడిపిల్లలు వెదకిఁబట్టి - పంతులచెంతన్
విడిపించఁగ శిక్షింపడె?
విడువక చనవలెను బడికి - వేళకు పుత్రా 23

కం॥ బడిలోని వస్తువైనను
బడిబాలుర పాత్రమైనఁ - బలకలు, బెంచీ
లడుగున నైనను దాచకు
కడపట కనుగొన్న నీకు - కష్టము పుత్రా 24.

కం॥ బడివేళకు నేగెదనని
వెడలియు నొకచోట నాడి - వేళకు నింటన్
గుడుచుట కేగిన, మీ వా
రడిగియు దండించఁగలరు - యువనిని పుత్రా 25.

కం॥ బడిలో నీ వస్తువులన్
విడిపించియు నింటి కనుగఁ - బిల్లలు వాటిన్

వడిఁగొని పోఁజూతురు, మఱి
యడిగిన నవి దొఱుకఁబోవు - యువతిని పుత్రీ 26.

కం॥ బడి దినమొండైనను, మఱి
విడిది దినమ్మైనను గాని - వీధినిపోవన్
గడు జాగ్రత్తగఁ జూచియు
నడచినయెడ నీకు నెపుడు - నయమౌ పుత్రీ 27.

కం॥ బడిలో పాఠము మానియు
కడు డంబముఁ జూపుచున్న - కనఁగొని పంతుల్
విడువక శిక్షించును, మఱి
బడి పాఠము నీకురాదు - బాగుగ పుత్రీ 28.

— సహజ గుణములు —

కం॥ జూదంబు లాడఁబోకుము
వాదంబులు గలుగుచుండు - వసుమతిలోనన్
బాధలు గలుగును, నీకిఁక
సాదానికినైన కష్ట - సాధ్యమె పుత్రీ 29.

కం॥ పరులను గిచ్చినఁ, దిట్టినఁ,
బరిహాసముఁ జేయుచున్న - వారెల్లయునన్

కరుణింపక నినుఁగొట్టరె?
మఱువుమురా తగని పనులు - మహిలో పుత్రా 30

కం॥ రచ్చలగుచోట నిలచిన,
హెచ్చుగ జనులుండుచోటు - లెఱిఁగి నిలిచినన్
తుచ్ఛులఁజేరి మెలంగిన
వచ్చును కష్టంబు నీకు - వసుధను పుత్రా 31

కం॥ పెద్దలుఁ జెప్పిన సుద్దులు
శ్రద్ధగ విని నడువ నీకు - శాంతము కుమరున్
బుద్ధిఁగలవాడ వౌదువు
తద్దయు సౌఖ్యంబుఁ గల్గు - ధరలో పుత్రా 32.

కం॥ కొలఁకులు, బావులు, మడుగులుఁ
గల తావుల కేగి దిగుటఁ - గాంచిన, నీకా
స్థలమందు హాని కల్గును
నిలువకు మటువంటిచోట - నిజముగ పుత్రా 33.

కం॥ పుట్టల, బొక్కల లోపల
పెట్టకుతా జేతులందు - విషజీవులు, నిన్
బట్టియు కఱచియు శ్రమలన్
బెట్టించియు హానిఁదెచ్చు - పెంపుగ పుత్రా 34.

కం॥ చెడుగుణమున వర్తిఁచెడి
బుడుతలతో నీవు జేరఁ - బోయిన, భువిలో
చెడుపేరు గలుగు, హానియు
విడువక చేకూరవచ్చు - వినురా పుత్త్రా 35

కం॥ తినుచుఁ ఫలహారంబులఁ
గనుపింపకు మార్గమందు - గ్రద్దలు, కోతుల్
గని, కొనిపోవును తప్పిన
పెనుదెబ్బలు తగులు నీకు - వినురా పుత్త్రా 36

కం॥ అమ్మాయిడు బువ్వఁ గైకొని
కమ్మగఁ దిని మూతి, చేయి - కాళ్లను బయటన్
నెమ్మదిగ జలము తోడను
యిమ్ముగ శుభ్రంబుఁజేయి - నెఱుఁగుము పుత్త్రా 37.

కం॥ జల మలబాధలు, దాహముఁ
గలిగినదని యొజ్జనడిగి - కదలి బయట పి
ల్లలతో నాట్లాడకురా
తెలిసిన శిక్షించు నతఁడు - తిరముగ పుత్త్రా 38.

కం॥ గోచిని పెట్టక మెలఁగుట
యాచారము యౌనె చూడ - నవనిపయిన్, నీ

జూచెడి వారందఱు బహు
నీచముగాఁ జూడఁ గలరు - నిజముగ పుత్రా 39.

కం॥ ఎఱిఁగిన విషయము దాచియు
నెఱుఁగని విషయమ్ము మిగుల - నెఱిఁగితిననుచున్
బరులకుఁ దెల్పినయెడ, వా
రెఱిఁగియు దండించఁ గలరు-యిలలో పుత్రా 40.

కం॥ జంతువుల చెంతఁ జేరియు
సంతసమున యాటలాడఁ - జనుదెంచకు రా
గంతులు వైచియు నవి, నీ
కంతట కష్టంబుఁ దెచ్చు - నరయఁగ పుత్రా 41.

కం॥ గురువరులు, తల్లి దండ్రులు,
పెరవారలు మెచ్చునట్లు - వినయముతోడన్
గురుతెఱిఁగి నడచుకొనినన్
మఱియిక నిను పొగడుచుంద్రు-మహిలో పుత్రా 42.

కం॥ నీ సొత్తు కానిదెప్పుడు
నాశింపకు, దొంగిలింప - నఱుఁగకు, చనినన్
దోసము లెంచియు నితరులు
వాసిగ దండించఁ గలరు - వసుధను పుత్రా 43.

క॥ జోగుల, జంగము వారల
మూగల, కనుగ్రుడ్డి, చెవిటి, - ముక్కిడివారల్
యోగుల, దాడీల్వారల
రోగుల నిందింపఁ బోకు - రూఢిగ పుత్రా 44.

క॥ సరసంబు లాడఁ జనినను
పొరుగిండ్లకు వెడలుచున్న - బుధులను నైనన్
బరుషోక్తు లాడఁ జనినను
విఱివిగ కష్టంబుఁ గలుగు - వినురా పుత్రా 45.

క॥ మిఁడి మిడి యెండల యందున
గొడుగును చెప్పులను వేసు - కొనక, బయటికిన్
దడ దడయని వెళ్లిన యెడ
యిడుమలు కలుగంగవచ్చు - నిలలో పుత్రా 46.

క॥ ఆటాడు వేళలందున
పోటా పోటీలు లేక - బుధులతోడన్
వాటంబెఱుఁగుచు నాడిన
చేటొదగక సౌఖ్యమబ్బు - క్షితిలో పుత్రా 47.

క॥ చీకటిఁ గల దినములలో
ప్రాకెడి జీవంబు లైన - పాములను, నీ

కేకార్యమున్న, వెలుపల
పోకుండిన కీడు గలుగఁ - బోదర పుత్రా 48.

కం॥ తినునట్టి ఫలములైనను
కనుఁగొని చేఁబట్టి నీవు - కత్తులతోడన్
నఱుకలు జేయను పూనకు
చెనకిన చెయి కాలుఁ దెగును - క్షితిలోఁ పుత్రా 49.

కం॥ దుడుకుపనులుఁ జేసినఁ, జూ
చెడి వారలు నిన్నుఁ గాంచి - ఛీ ఛీ యనుచున్
యిడుములు బెట్టఁగఁ జూతురు
చెడు పేరును కలుగు కడకు - స్థిరముగ పుత్రా 50.

కం॥ పెరవారలఁ బిలచెడి విధ
మెఱిఁగియు పిలువంగఁ జూడు - మిష్టముతోడన్
ధరఁ గీర్తిఁ బడయుచుందువు
నిరతము వర్తింప సుఖము - నిజముగ పుత్రా 51.

కం॥ గట్టిగ గుడి గోపురములు,
గట్టులు, భవనంబు లెట్టి - గోడలు మాటి, యే
చెట్టును, రథంబులెక్కకు
పట్టటు తప్పినను నీకు - బాధగు పుత్రా 52.

కం॥ పురమున మృగ ఖగములఁ గని
పరుగిడి శిలఁ బట్టి వేయఁ - బరులకు తగులన్
యెఱిఁగిన, వారప్పుడె నిను
కరుణింపక కొట్టఁ గలరు - గాంచియు పుత్రా 53.

కం॥ ఎప్పుడు సత్యము బల్కిన
మెప్పును బడయంగఁ గలవు - మేదినియందున్
తిప్పలు మొఱఁగలిగిన, నీ
వెప్పుడు నది మఱవవలదు - యిలలో పుత్రా 54.

కం॥ ధరఁ బంచగ దినక్రమమును
పరుసగ నీవెఱుఁగఁ గోరి - బహు శుచి తోడన్
స్మరియింపుము యాస్వాముల
వరములఁ బొందంగఁ గలవు - వసుధను పుత్రా 55.

కం॥ పలువిద్య లెన్ని నేర్చిన
కులవిద్యను మఱవకున్న - గుణవంతుఁడవై
మెలఁగుదువు ధరణి యందున,
కలుగకు కష్టంబులెపుడుఁ - గాంచఁగ పుత్రా 56.

కం॥ ఉదయమున నిదుర లేచియు
పదిలముతో దంతశుద్ధి - పఱచిన - నీకే

విధమైన జబ్బుగలుగను
వదలకురా దినదినమ్ము - పద్ధతి పుత్రా 57.

క॥ వేళకు శయ్యను వీడుము
వేళకు భుజియింప నెఱుఁగు - వెలితిగనున్నన్
వేళకు బడికిని వెడలుము
వేళకు నిదురింప సుఖము - పెంపగు పుత్రా 58.

[ఆరోగ్య విధులు.]

క॥ ఆరోగ్యమె భాగ్యంబని
వేరుగఁ జెప్పఁగవలెనె? - విశ్వమునందున్
గోరియు నెఱిఁగియు మెలఁగిన
వారికి సౌఖ్యంబుఁ గల్గు - బాగుగ పుత్రా 59.

క॥ చెడు గాలిఁ బీల్చఁ బోకుము
చెడు నీరును త్రాగఁబోకు - స్థిరముగ నెపుడున్
చెడు యన్నము భుజియింపకు,
చెడకుండును నీదు తనువు - క్షితిలో పుత్రా 60.

క॥ కలిగిన దుస్తుల నెప్పుడు
మలినము లేనివి ధరించు - మానినయెడలన్
బలువురు దూషింతురు, మఱి
కలుగును రోగంబు నీకు - గట్టిగ పుత్రా 61.

కం॥ పరులు తినఁగ మిగులన్నము,
చిఱుతిండియు, పండ్లు, నీవు - చేకొని వారిన్
సరియని భుజియించిన యెడ
పరగఁగ రోగంబుఁ బుట్ట - వచ్చును పుత్రా 62

కం॥ పురమున నిరతము వాడెడి
చెఱువైనను, బావియైనఁ - జెడకుండ నటుల్
పరికించుకొనుచు క్షితిని
గురుతెంచియు త్రాగుచున్న - గుణమగు పుత్రా 63.

కం॥ వివిధములగు పెంటలు, నీ
భవనంబునఁ జేయుచుండ - వాటిని తొలగిం
చు విధమెఱుంగుము, తప్పిన
నవకాశము లేక రోగ - మంటును పుత్రా 64.

కం॥ పలకపై నెంగిలిఁ బూయుట,
బలపంబును, చేతివ్రేళ్లు, - వలువలు, నోటన్
నిలుపుట, పెన్సిలు జిహ్వకుఁ
గలిపించుట తగని పనులు - గాంచగ పుత్రా 65.

కం॥ చెడుఫలములు కసుగాయలు
చెడుయన్నము మఱియు చెడిన - చిఱుతిండెల్లన్

గుడువకు, కుడిచిన శీఘ్రమె
చెడురోగము కలుగు నీకు - క్షితిలో పుత్రా 66.

కం॥ నిరతము గోరులు పెరుగును
యెఱిఁగియు కోయించుకొనుము - యేవిధమైనన్
మఱికందు చేరుచుండును
మఱి, శుభ్రముఁ జేయు మేలు - మహిలో పుత్రా 67.

కం॥ నెల కిరు మార్జనఁ, జముడుఁ
దలకంటియు స్నానమాడ - తగుసౌఖ్యంబా
నిలిపినయెడ రోగంబులు
పలువిధములు నీకు కలుగ - వచ్చును పుత్రా 68.

కం॥ తడినేలను వసియించిన,
వడగండ్లను తినిన, మఱియు - వానలఁదుంపన్
దడసిన, నీ కెటులయినన్
బడిసము దగ్గైనఁ గల్గ - వచ్చును పుత్రా 69.

కం॥ వలువకు చీమిడి రుద్దుట.
తలదువ్వక మెలఁగుచుంట - తగుచోటులలో
పలుమాఱు నెంగిలి నుమియుటఁ,
దలపంగా నవియు నీకు - తగవుర పుత్రా 70,

కం॥ జలముఁ గల చెంబు నోటన్
గలిపించియు ద్రాగుట, నిఁక - కంచము, నీచే
తులతో ముట్టుట, తిను యొం
గిలి మెతుకులు చల్లరోత - క్షితిలో పుత్రా 71.

కం॥ కసరత్తు ప్రతి దినమ్మును
గసపుట్టెడు వఱకుఁ జేసి - కడపటనింటన్
వెస నీట స్నానమాడిన
పసకలిగిన తనువుయౌను - వసుధను పుత్రా 72.

కం॥ బలమగు రోగుల యొద్దను
మెలఁగకు నిమిషంబునైన - మేవినియుంటన్
మెలిఁగిన పలురోగంబులు
కలుగును శీఘ్రంబులోన - గాంచఁగ పుత్రా 73.

కం॥ సిగరెట్లను, బీడీలను,
పొగచుట్టలు, నల్లమందు, - పొడుమును, గంజాయ్
దెగఁబడి యుపయోగించిన
దిగఁబడిపో బోవు తనువు - లయముగ పుత్రా 74.

కం॥ జలదారి నీరు, నెంగిలి,
పలుజీవుల పెంటలైన - పాదములంటన్

జలమును గైకొని శుభ్రము
మొలకువతోఁ జేయుమేలు - మేదిని పుత్రా 75.

కం॥ తినునప్పుడు మాట్లాడకు
కనుపించును దగ్గు, తుమ్ము - గానటబెట్టక
తినునది నీవంయునైనక
గనుపించియు రోతబుట్టఁ - గలుగును పుత్రా 76.

కం॥ ముక్కు, చెవిరంధ్రములలో
నెక్కించకు గింజలైన - నిష్టముతోడక
పెక్కగు బాధలు కడపట
చక్కగ చేకూరు నీకు - జగతిని పుత్రా 77.

కం॥ పెరవారలు తమదుస్తుల
మురికెఱిఁగియు విడువగాను - ముదమునదానిక
యెఱిఁగియు ధరియింపకురా
పరగఁగ రోగంబుఁ గల్గ - వచ్చును పుత్రా 78.

కం॥ మురుగుడు కాల్వల చెంతను
మఱి, పశువుల శాలచెంత - మానక నెపుడుక
పరగఁగ నిదిరించిన యెడ
తఱచుగ రోగంబువచ్చుఁ - దలఁపఁగ పుత్రా 79.

కం॥ చలికాలములో నైనను
వలువలు ముఖమునకుఁ గప్పి - పదిలముతోడన్
జలిఁ దీరఁ బవ్వళించిన
పలువిధముల జబ్బుకల్గు - వచ్చును పుత్రా 80.

కం॥ చలిగాచు కొనుటకైనను
నిలువకు మగ్గిగలచోట - నీ కెటులయినన్
కలుగును పెనుకష్టంబులు
నిలువకురా యట్టిచోట - నిజముగ పుత్రా 81.

కం॥ దినమున కొక మారైనను
యనువుగ స్నానంబుఁ జేయు - నతిశుచియౌ, నీ
తనువందు లేటదైనను
కనరా దెప్పుడైన గాని - గాంచఁగ పుత్రా 82.

కం॥ దినదినము నీవు చేసెడి
పనులకుఁ దనువలసి చెమట - పట్టును నటుపై
ననువుగ స్నానము జేసిన
కనుపించదు గజ్జియైన - గాంచఁగ పుత్రా 83.

కం॥ గాలెక్కువగా వీచెడి
కాలమునఁ దిరిగిన, చెట్ల - కడనుండిన, నీ

కేలాగైన నపాయము
చాలా కలుగంగవచ్చు - జగతిని పుత్రా 84.

క॥ చలిబాధఁ దీర్చుకొనుటకుఁ
గలదుస్తుల శుభ్రపఱచి - కప్పుకొనుమురా
చలియే మాత్రము నంటదు
కలుగదు జలుబైన నీకు - గాంచఁగ పుత్రా 85.

కం॥ చిఱుతిండియైన గానీ
వరియన్నంబైనగాని - వలచి మితముగన్
గురుతెంచియు తినఁ గోరుము
ధరసౌఖ్యము పొందఁగలవు - తద్దయు పుత్రా 86.

—♦ భక్తి ♦—

కం॥ బడియుండు రెండు పూటలు
విడువక నందఱును గూడి - వేడుకలలరన్
నుడివిన, భగవన్నామము
కడుసౌఖ్యము లమరుచుండు - గట్టిగ పుత్రా 87.

కం॥ దండము నిడు పెద్దలకును
దండము నిడు నీదు తల్లి - దండ్రులకెపుడున్

దండము నీకు గురువరునకు
దండము నీకు స్వామిఁ దలఁచి - ధరలో పుత్రా 83.
కం॥ తొలుత గణపతిని, వాణిని
పలువిధముల ననుదినమ్ము - ప్రార్థించియు, కాఁ
గల పాఠంబులఁ జదువఁగఁ
దలపెట్టుము శ్రద్ధగాను - ధరలో పుత్రా 89.
కం॥ పదిమాసంబులు మోసిన
పిదపన్ భువిపైన నిన్ను - విడిచినది మొదల్
వదలకఁ బ్రోచిన తల్లిని
ముదమున పూజింపమేలు - ముద్దుల పుత్రా 90.
కం॥ జనకుఁడు సంపాదించిన
ధనమును వెచ్చించి నీకు - తగు సౌఖ్యమ్ముల్
యొనగూర్చియు చదివించిన
ఘనునే పూజించవలయుఁ - గదరా పుత్రా 91.
కం॥ గురు పదయుగ్మము నిరతము
మఱవక సేవించుచున్న - మానక వడిగా
ఎరివిగ విద్యలు నలవడు
మఱియోగ్యుఁడ వౌదువీవు - మహిలో పుత్రా 92.

క॥ పరిపరి విధముల దేవుని
నిరతము భజియించుచున్న - నీక్షేటులయినన్
తిరముగ మోక్షము దొరకును
మఱువకురా దైవభక్తి - మహిలో పుత్రా 93.

క॥ పురమునఁ గల దేవాలయ
మెటేఁగియు చనుదెంచి యచట - నితరులతోడన్
హరినామ భజన సల్పియు
మఱలినయెడ యింటికపుడె - మంచిది పుత్రా 94.

క॥ బడిలో క్రమ శిక్షకు, లోఁ
బడి శ్రద్ధగఁ జదువుచున్న - పంతు లెఱుఁగుచున్
నడవడి సర్టిఫికేట్టును
కడపట నినుమెచ్చి యిచ్చు - గదరా పుత్రా 95.

క॥ చదివియు సర్టిఫికేట్టును
ముదమున చేఁబట్టుకొనిన - మొనఁగాడవునై
పదిలముగ బ్రతుకఁ జూతువు
వదలక సౌఖ్యంబుఁ గల్గ - వచ్చును పుత్రా 96.

క॥ బడిపంతు లగుట వల్లను
బడి బాలుర కేను నీతి - పద్ధతి కొంతన్

నుడివితి, దీనిని జదివియు
నడచినయెడ నీకు సెపుదు - నయమగా పుత్రీ 97.

కం॥ ఇల పుత్రీ శతక మెవ్వరు
వలచి పఠించినను, వినిన - వ్రాసిన యెడలన్
సులువుగ విద్య లభించును
కలుగును జ్ఞానంబు మిగుల - గాంచఁగ పుత్రీ 98.

కం॥ యువ, పుష్య, శుద్ధ దశమీ
దివసము భృగువారమందు - దీటుగ దీనిన్
భువియందున వెలయుంగను
చవిఁ బుట్టఁగ వ్రాసినాడ - సరళిగ పుత్రీ 99.

కం॥ బలిజె కులోద్భవుఁడను, నన్
బిలుతురు రామయ్య పేరఁ - బ్రియ మలరంగా
జిలకర మునుసామికిఁ దగు
కులసతి పొట్టెమ్మ కేను - కొడుకను పుత్రీ 100.

కం॥ ధర వేంకటాచలం బను
"తిరుపతి" పురమందు నేను - స్థిర వాసుఁడనై
నిరతము రాముని పదముఁలు
మఱువక పూజించు చుందు-మహిలో పుత్రీ 101.

పుత్ర శతకము నచ్చొత్తించుటకు యీ క్రింద కనినవార్లు కొంత ధన సహాయము మొనర్చిరి. గాన దేవుడు వీర్ల కెల్లప్పుడు ఆయు రారోగ్యైశ్వర్యము సమృద్ధిగ నొసంగవలెనని ప్రార్థించు చున్నాను.

| | |
|---|---|
| చిత్తూరు జిల్లా<br>పుత్తూరు తా॥<br>అబ్బిఖండ్రిగ<br>గ్రామవాసులు | మ॥రా-రా-శ్రీ, కొండూరు వెంకటరాజు గారు,<br>,, ముప్పాల నారాయణరాజు గారు,<br>,, కొండూరు పిచ్చిరాజు గారు,<br>,, [అక్కమ్మ కూతురు] ముప్పాల నాగరాజు గారి భార్య నారాయణమ్మ గారు, |
| తిరుమండ్యం<br>గ్రామం. | మ-రా-రా-శ్రీ, దొమ్మరాజు చెంచురాజు గారు.<br>పుత్తూరు తా॥ చిత్తూరుజిల్లా. |
| చెంగల్పట్టు.జి.<br>తిరువళ్లూరు తా॥<br>అగరం<br>గ్రామవాసులు | మ-రా-రా-శ్రీ,<br>మారేపాటి మునుస్వామినాయుడు గారు,<br>మారేపాటి ఎల్లమనాయుడు గారు. |

ఇట్లు,

గ్రంథకర్త.

